# తెలుగు భాష — గతం, వర్తమానం, భవిష్యత్తు



ప్రపంచీకరణ– నేటి అనివార్యమైన వాస్తవికత. బహుముఖీనత కలిగిన ఈ భాషాసాంస్కృతిక, ఆర్థిక ప్రపంచాన్ని ఏకీకృతంగా మార్చడానికి జరిగే ప్రయత్నంలో 'ప్రపంచీకరణ' ముందుకు వచ్చింది. ఆర్థిక సాదృశ్యత అందరూ ఆహ్వానించేదే అయినా, భాషాసంస్కృతుల విషయంలో ఇది గొడ్డలిపెట్టు. ప్రపంచంలోని అనేక భాషాసంస్కృతులు ఈ వధ్యశిల కింద నలిగిపోయి కాళ్లువిరిగి మూలుగుతున్నాయి. భాషను ఒక సాంస్కృతిక వాహికగా గుర్తించకపోతే ప్రపంచవ్యాప్తంగా అనేక జాతులు చరిత్ర ఉండీ చరిత్ర హీనంగా తయారయ్యే ప్రమాదం పొంచి ఉంది. ప్రపంచవ్యాప్తంగా దాదాపు 15కోట్ల మందికి పైగా తెలుగు ప్రథమభాషగా కలిగిన వ్యవహర్తలున్న తెలుగు భాష అంతరించడానికి అవకాశంలేకున్నా విద్య, పరిపాలనా రంగాల్లో తెలుగు అమలవుతున్న తీరు, తెలుగు భాషపై రెండు తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలకు ఉన్న చిన్నచూపు తెలుగు భాషాభిమానుల్లో భయాందోళనలను కలిగిస్తోంది. ఆచార్య ఉమామహేశ్వర రావుగారి మాటల్లో చెప్పాలంటే 'తెలుగు భాషకు ఇది సంక్షోభ కాలం'. తెలుగును ప్రత్యేకాంశంగా స్వీకరించి అధ్యయనం చేస్తున్న విద్యార్థులకు ఉపాధి అవకాశాలు లేకుండా పోతున్నాయి. తెలుగును సంరక్షించటమంటే తెలుగు సంస్కృతీచరిత్రలను పరిరక్షించి, భావి తరాలకు అందించడంగా 'అధ్యయనం' బలంగా విశ్వసిస్తోంది. ఈ 'సంక్షోభ సమయం'లో తెలుగు భాషాసాహిత్యాలను ప్రత్యేకాంశంగా స్వీకరించి అధ్యయనం, పరిశోధనలను కొనసాగిస్తున్న విద్యార్థులకు తెలుగు భాషాసంస్కృతుల పరిరక్షణకు ఉండాల్సిన ఎరుకను కలిగించాలని 'అధ్యయనం' భావిస్తోంది. విద్యార్థులు తమ ముందున్న ఉపాధి అవకాశాలను అందిపుచ్చుకోడానికి కావాల్సిన కౌశలాలను మరింత వృద్ధిచేసుకోడానికి గల మెళకువలను నిపుణులైన వారిచేత చెప్పించటం అవసరమని అధ్యయనం' తలుస్తోంది. కనుక, ఈరోజు "తెలుగు భాష– గతం, వర్తమానం, భవిష్యత్తు" అనే అంశంపై ఆ రంగంలో అనుభవమున్న డా. పమ్మి పవన్‌కుమార్ గారిని వక్తగా ఈ సమావేశానికి రూపకల్పన చేసింది.

డా. పమ్మి పవన్‌కుమార్ గారు హైదరాబాద్ విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. ఈయన 11 సంవత్సరాలుగా భాషాశాస్త్రాన్ని, భాషాశాస్త్ర అనువర్తిత శాఖ అయిన 'కంప్యుటేషనల్ లింగ్విస్టిక్స్'ను బోధిస్తున్నారు. 'కట్టా వరదరాజు ద్విపద రామాయణం: భాషాపరిశీలన' అనే అంశంపై పిహెచ్.డి. చేసి, హైదరాబాద్ విశ్వవిద్యాలయం నుంచి 2003లో డాక్టరేట్ పొందారు. పాఠ్య పుస్తకాల, నిఘంటువుల, పద ప్రయోగ కోశాల, భాషా బోధక వాచకాల తయారీలో రచయితగానూ, సహ రచయితగానూ, సహ సంపాదకుడిగానూ, సాంకేతిక సహాయకులుగానూ వివిధ స్థాయిల్లో పనిచేసారు. వీరు 'తెలుగు కన్నడ నిఘంటువు' నిర్మాణంలోనూ, 'జర్నలిజం'పై రాసిన పుస్తకాలకు సహ రచయితగానూ పనిచేసారు. హైదరాబాదు విశ్వవిద్యాలయం దూర విద్యాకేంద్రం విద్యార్థులకోసం 'ప్రసార మాధ్యమాలు–ప్రాథమిక అంశాలు', 'నివేదన పద్ధతులు: భాష', 'అనువాద విధానాలు' వంటి పుస్తకాల రచనలో రచయితగానూ, సహ రచయితగానూ ఉన్నారు. 'హరివంశం', 'పారిజాతాపహరణం' గ్రంథాలకు కూర్చిన పదప్రయోగ కోశాలకు సహ సంపాదకులుగా వ్యవహరించారు. ప్రవాసాంధ్రులకు తెలుగు నేర్పడంకోసం సిలికానాంధ్ర, తెలుగు అకాడమి వారి 'తెలుగు వాచకాల' తయారీలో సహ రచయితగా పనిచేసారు. ఇప్పటివరకు వారు 32 పరిశోధన పత్రాలను రచించారు. "సాహిత్య విమర్శ– సిద్ధాంతం, సూత్రం: అనువర్తన", "భాషాభూషణం", కంప్యుటేషనల్ లింగ్విస్టిక్స్ ఆధారంగా రాసిన 'బుభుత్స' పరిశోధన పత్ర సంపుటితో పాటు తన 'ఎం.ఫిల్, పిహెచ్.డి' గ్రంథాలు కూడా అంతర్జాల ప్రచురణలుగా వెలువడ్డాయి. డా. పమ్మి పవన్‌కుమార్ గారు హైదరాబాదు విశ్వవిద్యాలయం అందించే 'ఉత్తమ యువ పరిశోధకులు' పురస్కారానికి 2012 సంవత్సరానికిగానూ ఎంపికయ్యారు.

## వక్త: డా. పమ్మి పవన్‌కుమార్

**(అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ , హైదరాబాద్ విశ్వవిద్యాలయం)**

**స్థలం: అంబేద్కర్ ఆడిటోరియం**
**హైదరాబాద్ విశ్వవిద్యాలయం**

**తేది: 27/10/2015; మంగళవారం**
**సమయం: సాయంత్రం 4:30 గం.లకు**

## అధ్యయనం

## తెలుగు కళాసాంస్కృతిక సాహిత్య చర్చావేదిక

హైదరాబాద్ విశ్వవిద్యాలయం–గచ్చిబౌలి, హైదరాబాదు.

ఫోన్: 9493971126,9441006418, 9963709032

అందరికీ ఇదే మా సాదర ఆహ్వానం